# III. ఇస్లామ్ యొక్క మూడవ మూల స్థంభం - జకాత్

## 1. జ కా త్ (విధి దానం)

జకాత్ అంటే "వృద్ధి చెందుట, పరిశుద్ధత నొందుట" అని అర్థము. ప్రతి విశ్వాసి అల్లాహు తఆలా తనకు ప్రసాదించిన సంపద నుండి నిర్ణీతమైన భాగమును అల్లాహు తఆలా యొక్క ఆజ్ఞానుసారం పేదలకు ఇచ్చు సొమ్మును జకాత్ అందురు. దీని వలన మనిషి సంపద పరిశుద్ధత నొందుటతో పాటు, అతని పుణ్యం కూడ వృద్ధి చెందుతుంది. కాబట్టే దీనిని జకాత్ అనిఅన్నారు(బిహిష్తీ జేవర్,3/22,దీనియాత్ 2 యం/76)

## 2. జకాత్ యొక్క ప్రాముఖ్యత

ఇస్లామ్ యొక్క ప్రాథమిక బోధనలలో ఈమాన్, నమాజ్‌ల తరువాత మూడవ స్థానం జకాత్‌కున్నది. నమాజ్ శారీరక సంబంధమైన ఆరాధనైతే, జకాత్ ఆర్థిక సంబంధమైన ఆరాధన.

పవిత్రమైన ఖుర్‌ఆన్ గ్రంథంలో నమాజ్‌తో పాటు జకాత్‌ను గురించి కూడా ఆజ్ఞాపించడమైనది - **"నమాజ్‌ను స్థాపించండి, జకాత్‌ను చెల్లించండి"** (సూరయె బఖర,ఆ.43) ముస్లిమ్‌ల యొక్క ఆవశ్యకమైన లక్షణాలను తెలియ జేస్తూ ఇట్లు తెలుప బడినది: **"వారు నమాజ్‌ను స్థాపిస్తారు, జకాత్‌ను చెల్లిస్తారు"**(9.తౌబ, ఆ.18) దీనిని బట్టి మనకు తెలియునది ఏమనగా, నమాజ్ స్థాపించనివారు, జకాత్ చెల్లించనివారు నిజమైన ముస్లిమ్‌లు కారు. (ఇస్లాం క్యా హై ? స. 34)

అల్లాహు తఆలా మనకు ప్రసాదించిన సంపద నుండి కొంత ఆయన ఆజ్ఞానుసారం పేదలకొరకు ఖర్చు చేసినచో అల్లాహు తఆలా మిక్కిలి సంతోషిస్తాడు. అంతేగాక గొప్పగొప్ప పుణ్యఫలాల వాగ్దానం చేసిచున్నాడు. (ఇస్లాం క్యా హై ?)

అల్లాహు తఆలా ఎవరికైతే సుఖసంతోషాలు, సిరిసంపదలు ప్రసాదించాడో వారు, పిసినారితనంతో జకాత్‌ను చెల్లించక, అల్లాహు తఆలా యొక్క ఆజ్ఞానుసారం పేదలకొరకు ఖర్చు చేయనిచో, నిస్సందేహంగా వారు మిక్కిలి కృతఘ్నులు మరియు దుర్మార్గులు. ప్రళయ దినాన వారికి అల్లాహు తఆలా కఠినాతి కఠినమైన శిక్షను విధిస్తాడు. వారికి లభించే చెడు పరిణామము, వారికి విధించబడే కఠినమైన శిక్ష

ను గూర్చి ఆలోచించిననే మన శరీరము పై వెంట్రుకలు నిక్కపొడుచు కొనును, మన మనసు, శరీరము కంపించును. (ఇస్లాం క్యా హై ? స. 37)

## 3. జకాత్ ఇవ్వని వారి కొరకు హెచ్చరిక

తమ దగ్గర జకాత్ విధి యగుటకు అవసరమైన సంపద ఉన్నప్పటికి, ధనము మీద ప్రేమ వల్ల, పిసినారితనము వల్ల జకాత్ దానము చెల్లించని వారికి భయంకరమైన శిక్ష విధిస్తానని అల్లాహు తఆలా హెచ్చరించు చున్నాడు.

“వెండి, బంగారాలను అల్లాహ్ మార్గములో ఖర్చు పెట్టకుండా దాచిపెట్టే వారికి మిక్కిలి బాధతో కూడిన శిక్ష లభించునని తెలియ చేయండి. ఈ వెండి, బంగారమును నరకాగ్నిలో కాల్చి వారి నొసటిపై, వారి పార్శ్వములపై, వీపులపై వాతలు వేయబడతాయి. ఇది మీరు మీ కొరకు కూడబెట్టు కొనినది, దీని రుచి చూడండి” (అని చెప్పబడుతుంది) (అల్‌ఖుర్‌ఆన్, 9/34-35)

ఎవరైతే జకాత్ దానము చేయుట విధియై యుండి కూడా దానిని చేయడో, వానికి కఠిన శిక్ష లభించును. హజ్రత్ రసూలుల్లాహ్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు ఇట్లు తెలిపిరి: “అల్లాహు తఆలా సిరి సంపదలు ప్రసాదించిన పిదప కూడ జకాత్ దానము చేయనిచో, ప్రళయ దినాన అతని సంపద తీవ్ర విషపూరిత బట్టతల గల సర్పమగును. దాని కండ్లపై భయంకరమైన రెండు నల్లని మచ్చలుండును. ఆ సర్పము అతని మెడను కడియము వలె చుట్టుకొనును. ఆ సర్పము అతని రెండు దవడలను కొరుకుతూ నేను నీ సంపదను, నేను నీ ఖజానాను అని పలుకు చుండును. (బుఖారీ, ముస్లిమ్) ఈ విషయము ఖుర్‌ఆన్ లోని మూడవ సూరహ్ అయిన ఆలెఇమ్రాన్ లోని 180 వ సూక్తి (ఆయత్) లో కూడ ప్రస్తావించ బడియున్నది. (ముస్లిం ఖవాతీన్ కే లియే 20 సబఖ్ స.13)

## 4. అల్లాహ్ యొక్క రక్షణ

జకాత్ చెల్లించని వారికి లభించే కఠిన శిక్షను భరించే శక్తి ఎవరికి గలదు? ఎవ్వరికీ లేదు అని అర్థం. అత్యాశ మరియు నశించే సంపదపై వ్యామోహంతో ఇంతటి ఘోరమైన శిక్షను అనుభవించుటకు పూనుకోవడం తెలివి

తక్కువ తనం, అజ్ఞానత్వం అవుతుంది. అల్లాహ్ ప్రసాదించిన దానిని, అల్లాహ్ మార్గంలో, అల్లాహ్ ఆజ్ఞాను సారం ఖర్చు చేయకపోవుట ఘోర పాపము మరియు సిగ్గు పడవలసిన విషయము.

ఒకవేళ మీపై జకాత్ ఫర్జ్ అయి యున్నచో, దానిని వెంటనే చెల్లించండి, మీ బంధువులను కూడ జకాత్ దానం చేయుటకు ప్రోత్సహించి సంసిద్ధులను చేయండి. ఇదే మీ ప్రియమైన బంధుమిత్రుల మేలును కోరి చేయు కార్యములలో శ్రేష్ఠమైనది. ఎక్కువ మంది స్త్రీల చెంత నగలు ఉంటాయి కానీ వారు, వాటి జకాత్ చెల్లించరు. బహుశ వారు ప్రళయ దినాన తమ శరీరాన్ని అల్లాహు తఆలా యొక్క కఠిన శిక్షకు గురిచేయుట సత్కార్యముగా భావించు చున్నారేమో? (ముస్లిం ఖవాతీన్ కే లియే20 సబఖ్, స. 14)

అల్లాహు తఆలా పవిత్రమైన ఖుర్ఆన్ గ్రంథములో అనేక మార్లు జకాత్ దానము చేయుటకు ఆజ్ఞాపించి యున్నాడు. పవిత్రమైన ఖుర్ఆన్ గ్రంథములో 32 ప్రదేశాలలో నమాజ్‌తో పాటు జకాత్ దానము చేయుమని ఆజ్ఞాపించి యున్నట్లు ఇస్లామ్ పండితులు తెలిపి యున్నారు. ఇది కాక అనేక ప్రదేశాలలో జకాత్ దానము చేయమని ఆజ్ఞాపించబడి యున్నది. అలిఫ్ లామ్ మీమ్ పార (ఖుర్ఆన్ 30 పారాలుగా విభజింపబడి యున్నది) లో అల్లాహు తఆలా ఇట్లు తెలిపి యున్నాడు: "మరియు నమాజ్‌ను స్థిరముగా సలుపుచుండుము, జకాత్ (విధిదానము) చేయుము, మీకొరకు మేలు చేసి ముందుగా పంపుకున్న దానిని అల్లాహ్ చెంత పొందుదురు." (బఖర సూరహ్/110) (ముస్లిం ఖవాతీన్ కే లియే 20 సబఖ్, స. 15)

హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు ఇట్లు తెలిపిరి: నిస్సందేహంగా మిగిలిన సంపదను శుద్ధి పరచుటకు అల్లాహు తఆలా జకాత్‌ను విధిగావించెను. వారు సల్లల్లాహు అలైహి వ సల్లమ్ ఈ విధంగా కూడ తెలిపిరి: నిస్సందేహముగా మీ ఇస్లామ్ పరిపూర్ణత నొందాలంటే, మీరు జకాత్ దానము చేయండి."(ముస్లిం ఖ లి 20 స/15)

## 5. జకాత్ మూలంగా సంపద యొక్క దుష్ఫలితాలు దూరమగుట

హజ్రత్ రసూల్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు ఇట్లు తెలిపిరి: "జకాత్ దానము చేయుట వలన సంపద యొక్క దుష్టత్వము దూరమౌతుంది." సంపద మూలంగా

లాభాలున్నాయి, నష్టాలు కూడ ఉన్నాయి. జకాత్ దానము చేయుట వలన సంపద వలన కలిగే చెడు దూరమౌతుంది. అనగా బాగుగా లెక్కించి, సక్రమముగా సంపూర్ణంగా జకాత్ దానము చేసినచో, ఆ సంపద పరలోకములో బాధను కలిగించదు, ఇహలోకములో నశించదు, దాని వలన ఎటువంటి ఇతర ఇబ్బందులు కూడ కలుగవు. (ముస్లిం ఖవాతీన్ కె లియే 20 సబఖ్, స15)

హ్జ్రత్ రసూల్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు ఇది కూడ తెలిపిరి: మీ సంపద పై జకాత్ దానము చేసి సంపదను రక్షించు కొనండి. దానము చేయుట వలన మరియు దుఆ(వేదుకోలు) చేయుట మూలంగా మీ అనారోగ్యాన్ని దూరం చేయండి. అల్లాహ్ ముందు మీ నిస్సహాయతను తెలిపి, వినయ విధేయతను ప్రదర్శించి రాబోయే చెడును దూరం చేసుకోండి. (ముస్లిం ఖవాతీన్కే లియే20 సబఖ్,స16)

## 6. జకాత్‌ను చెల్లించనిచో కరువు కాటకాలు సంభవిస్తాయి

హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు ఇట్లు తెలిపిరి: ఎవరైతే జకాత్ దానము చెల్లించరో వారిపై అల్లాహు తఆలా కరువు కాటకాల ఉపద్రవాన్ని కల్పిస్తారు. ఇంకొక హదీసులో ఇట్లున్నది: ఎవరైతే జకాత్‌ను చెల్లించరో, వారి కొరకు శిక్షగా వర్షాన్ని కురిపించరు. జంతువులు మొదలగు ప్రాణులు లేనిచో వర్షము పడదు. (ముస్లిం ఖవాతీన్కే లియే20 సబఖ్,స16)

## 7. జకాత్ చెల్లించనిచో, సంపద నశించును

హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ ఇట్లు తెలిపిరి: భూమిపై గానీ నీటిలో గానీ సంపద నశించుటకు కారణము జకాత్‌ను చెల్లించక పోవుటయే. అంతేకాక జకాత్ విధి (ఫర్జ్) అయిన తరువాత చెలించనిచో, అది ఆసంపద నంతటిని నాశనము చేయనిదే వదలదు. అనగా జకాత్ విధి అయిన తరువాత దానిని తప్పక చెల్లించ వలయును. పిసినారి తనం చేత ఆ జకాత్‌ను చెల్లించక యుంచిన ఒకరోజు కాక పోయిన మరొక రోజు ఆ సంపద అంతయు తప్పక నశించును. (ముస్లిం ఖవాతీన్ కే లియే 20 సబఖ్ స.16)

ఇమామె అహ్మద్ బిన్ హమ్బల్ రహ్మతుల్లాహ్ అలైహ్ గారు “సంపద అంతయు నశించును” అనుటకు వివరణ ఇట్లు తెలిపిరి: జకాత్ పేదల హక్కు. కావున జకాత్ సొమ్మును మన స్వంతానికి వాడుకొను హక్కు మనకు లేదు. దానిని మనం తినినను, వేరే విధంగా వాడుకొనినను, అది మన విశ్వాసాన్ని, మన ధర్మాన్ని, మన పుణ్య ఫలాలను నశింపజేస్తుంది. కావున సంపద నశించును అను దానికి అర్థము సంపద మూలంగా మనకు లభించ వలసిన ప్రయోజనము కలుగక పోగా నష్టము కలుగునని అర్థం. (రాహె అమల్ స.78)

జకాత్ మరియు దానాదులు మన పేద సోదరుల హక్కు. దాని మూలముగా వారి అవసరాలు తీరుతాయి. జకాత్ చెల్లించక పోవుటచే మనం వారి హక్కును చెల్లించక, వారిపై దౌర్జన్యము చేసిన వారమగు చున్నాము. (ఇస్లాం క్యాహై? స.37)

## 8.జకాత్ ఫర్జ్ (విధి) కావడానికి షరతులు(నియమాలు)

1. ముస్లిమ్ అయి ఉండాలి 2. స్వేచ్ఛాజీవి అయి ఉండాలి. 3. బుద్ధిమంతుడై యుండాలి, పిచ్చివానిపై విధి కాదు. 4. వయోజనుడై యుండాలి. 5. స్థితిపరుడయి ఉండాలి (సాహిబె నిసాబ్). 6. ప్రాధమిక అవసరాలు మరియు అప్పు లేనివాడై యుండాలి. 7. సంపదపై సంవత్సరం గడవాలి. (దీనియాత్ 2 యం స.75)

**నోట్:** నివసించుటకు ఇల్లు, ధరించుటకు వస్త్రాలు, ఇంటిలో ఉపయోగించే వస్తువులు, పనిముట్లు, తన కొరకు వాడుకొనుటకు వాహనము మొదలగునవి ప్రాధమిక అవసరాలు.

## 9. జకాత్ ఫర్జ్ (విధి)కావడానికి మూల ధనపరిమితి (జకాత్ కా నిసాబ్)

జకాత్ ఫర్జ్ (విధి) కావడానికి షరీఅత్ నిర్ణయించిన కనీస ధన పరిమితిని **“జకాత్కా నిసాబ్”** అంటారు. అనగా కనీసం ఎంత సంపద కలిగి యుంటే జకాత్ దానము చేయుట ఫర్జ్ అవుతుందో, ఆ సంపదను జకాత్కా నిసాబ్ అని అంటారు.

ఇస్లాం షరీఅత్ ప్రకారము 71/2 తులాలు అనగా గ్రా. 87.479 మి.గ్రా. బంగారు లేక 521/2 తులాలు అనగా గ్రా. 612.360 మి. గ్రా. వెండి లేక ఈ రెండిటిలో ఒకదాని విలువకు సరిపడే రూపాయలు లేక వ్యాపారానికి ఉద్దేశించిన వస్తుసామగ్రిని "జకాత్‌కా నిసాబ్" (జకాత్ విధి యగుటకు ఉండ వలసిన కనీస మూల సంపద). ఈ సంపద కలిగియున్న స్త్రీ పురుషులను **"సాహిబె నిసాబ్"** (స్థితిపరుడు) అంటారు. అనగా జకాత్ విధి యగుటకు అవసరమైన కనీస మూల సంపద కలిగి ఉన్న వ్యక్తి అని అర్థము. ఇస్లామ్ షరీఅత్ ప్రకారము వీరు ధనవంతులు. ఈ సంపద లభించిన తరువాత ఒక సంవత్సరము గడిచినచో, జకాత్ దానము చేయుట వీరిపై విధి యగును. (దీనియాత్ 2 యం స. 76)

## 10. జకాత్ పరిమాణము అనగా ఎంత చెల్లించాలి?

సంపదపై 21/2 శాతం అనగా రూపాయలు, బంగారు, వెండి వీటన్నిటిపై 1/40వ వంతు జకాత్ చెల్లించ వలయును. పొలమునకు శ్రమించి నీరు కట్టవలసిన అవసరము లేని పంటలో, ఎంత తక్కువ పండినను, అందులో 10% (1/10వ వంతు) జకాత్ వాజిబ్ అవుతుంది. అనగా వర్షాధారముతో గానీ లేక ఏరు, నది, సముద్రపు తీర ప్రాంతాలలో వేసిన పంట, శ్రమించి నీరు కట్టవలసిన పని లేకుండానే పండిన పంటలో 10% జకాత్ ఇవ్వ వలెను. ఒకవేళ పొలమునకు శ్రమించి నీరు కట్టి పండించిన పంటలో 5%(1/20వ వంతు) జకాత్ ఇవ్వవలెను. పండ్ల తోటలు మొదలగునవి కూడా ఇలాగే గ్రహించ వలెను. (బిహిష్తీ సమర్, స.30)

### మసాయిల్ (సిద్ధాంతములు)

**01.** ఈ రోజులలో బంగారం ధర కన్నా వెండి ధర తక్కువగా యుండుటచే, వెండి ప్రకారము జకాత్ యొక్క నిసాబ్ తక్కువగా యుంటుంది. కావున ఇది త్వరగా పూర్తి అవుతుంది, కనుక దీనినే లెక్కించుట జరుగు చున్నది. (దీనియాత్ 2 యం స. 76)

**02.** ఎవరి దగ్గరైనా కొంత బంగారము, కొంత వెండి, కొన్ని రూపాయలు, కొంత వ్యాపార సామగ్రి ఉన్నాయి. కానీ ఏ ఒక్కటియు జకాత్ విధి అగుటకు కావలసిన కనీస పరిమితిలో లేదు. కాని వాటన్నిటి విలువను కలిపిన

7 1/2 గ్రాముల బంగారపు విలువ లేక 52 1/2 గ్రాములు వెండి విలువతో సమానంగా గానీ లేక అంతకన్నా ఎక్కువగా గానీ యున్నచో, అతను సాహబె నిసాబ్‌గా పరిగణింప బడుతాడు. ఆ సంపదపై సంవత్సరము గడిచి యున్నచో, అతను జకాత్ చెల్లించ వలెను.

**03.** సాహబె నిసాబ్ దగ్గర నగదు రూపాయలు ఏమియు లేకున్నను, బంగారు వెండి, ఇతర వ్యాపార సామగ్రి మూలంగా సాహబె నిసాబ్ అయినచో, ఉన్నవాటిలో ఏదో ఒకటి అమ్మివేసైనా సరే జకాత్ చెల్లించ వలెను. (దీనియాత్ 2 యం స. 76)

**04**. ఒకసారి సాహిబె నిసాబ్ అయిన తరువాత, సంవత్సరం చివర ఎంత సంపద యుంటే, దానిపై జకాత్ చెల్లించాలి. మధ్యలో తగ్గినను, పెరిగినను అది లెక్కలోనికి రాదు. ఉదా: సంవత్సర ప్రారంభంలో 50,000 ఉండినవి. మూడు నెలల తరువాత 40,000 వచ్చి చేరినవి. మొత్తం 90,000 ఆయినవి. ఆరు నెలల తరువాత 20,000 ఖర్చు అయిపోయినవి. సంవత్సర చివరలో అతనిదగ్గర 70,000 మాత్రమే యున్నవి. కాబట్టి ఇప్పుదు 70,000 లకే జకాత్ లెక్కించి చెల్లించ వలసి యుంటుంది. మధ్యలో పెరిగిన, తగ్గిన లెక్కరాదు. అనగా మూడు నెలల తరువాత కలిసిన వాటికి తొమ్మిది నెలలే అయినది కదా అని దానిని మూడు నెలల తరువాత లెక్కించడం మొదలగునవి యుండవు. (దీనియాత్ 2యం స. 76)

**05.** సంపద నుండి జకాత్ డబ్బులను వేరు చేయు నప్పుడు, లేదా జకాత్‌ను పేదవారికి చెల్లించు నపుడు మనసులో "నేను జకాత్ చెల్లించు చున్నాను" అని సంకల్పము తప్పక చేసుకోవాలి. అట్లు సంకల్పము చేయకనే చెల్లించిన జకాత్ చెల్లించి నట్లు పరిగణింపబడదు. కారణమేమన, ప్రతి ఫర్జ్‌ను ఆచరించు నపుడు, సంకల్పం చేయుట కూడ ఫర్జ్ యై యున్నది. కానీ ఇది జకాత్ సొమ్ము అని ఇచ్చేవారికి చెప్పి ఇవ్వవలసిన పని లేదు.

**06.** జకాత్ సొమ్ముతో వస్త్రాలు, సామానులు, ధాన్యము, సరుకులు మొదలగునవి కొని ఇచ్చుట కూడ ధర్మసమ్మతమే.

**07.** ఒకవేళ సాహిబె నిసాబ్ సంవత్సరము గడవక ముందే జకాత్‌ను ఇచ్చినను, ధర్మ సమ్మతమే.

**08.** ఇండ్లపై, దుకాణాలపై, ముత్యాలు, మాణిక్యాలు, రత్నాలు, వజ్రాలు మొదలగు వానిపై జకాత్ లేదు.

## 11. జకాత్ హక్కుదారులు ఎవరు?

**01.** మిస్‌కీన్ అనగా నిరుపేదలు, బొత్తిగా ఏమియు లేనివారు.

**02.** ఫఖీర్ అనగా పేదవాడు, కొద్దో గొప్పో సంపద యున్నను అది నిసాబ్ పరిమాణము కన్నా తక్కువగా యున్నవాడు.

**03.** ఋణగ్రస్తుడు. ఇతరులకు అప్పు యున్నవాడు. సంపద యున్నను అది అతని అప్పుతీర్చిన తరువాత నిసాబ్ కన్నా తక్కువగా యున్నవాడు.

**04.** ముసాఫిర్ అనగా ఇచ్చుట ప్రయాణములో డబ్బుల అవసరమున్న వాడు. తన స్వస్థలములో నిసాబ్ కన్నా ఎక్కువ సంపద యున్నప్పటికి ప్రయాణములో డబ్బులు అవసరమైనప్పుడు, అవసరమైనంత ధనాన్ని ఇచ్చుట ధర్మ సమ్మతమే. (దీనియాత్ 2 యం స.77)

## 12. జకాత్ కు అనర్హులు

**01. ధనికులు** అనగా జకాత్ చెల్లించ వలసి యున్నవారు మరియు జకాత్ ఫర్జ్ కాకున్నను అవసరముకన్న ఎక్కువ సంపద (ఇండ్లు, భూములు, సామాన్లు) కలిగియుండి, దాని విలువ నిసాబ్‌కు చేరియున్నవారు.

**02. సయ్యిద్ ఔర్ బనూహాషిం** కుటుంబీకులు అనగా హుజ్రూర్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారి వంశస్తులు.

**03. జకాత్ చెల్లిచే వ్యక్తి యొక్క సమీప బంధువులు** అనగా తల్లిదండ్రులు, తాత, ముత్తాత, అమ్మమ్మ, అమ్మమ్మ తల్లి, నాయనమ్మ, నాయనమ్మ తల్లి, ఇట్లే పైవరకు,

**04.** కొడుకులు, కూతుళ్ళు, మనమళ్ళు, మనమరాళ్ళు, మనమళ్ళ సంతానము, మనవరాళ్ళ సంతానము.

**05. భార్యాభర్తలు** – ఒకరు ఇంకొకరికి ఇచ్చుట ధర్మసమ్మతము కాదు.

**06. అవిశ్వాసి**

**07. ధనికుల పిల్లలు యుక్త వయస్సుకు చేరనివారు.** (దీనియాత్ 2 యం స. 77)

## మసాయిల్ (సిధ్ధాంతాలు)

**01.** సమీప బంధువులైన సోదరులు, అక్కాచెల్లెళ్ళు వారి సంతానము, పినతండ్రి, మేనత్త, పిన్నమ్మ, మామ, అత్త మామ, అల్లుడు మొదలగువారు జకాత్ యొక్క హక్కుదారులైనచో, వారికి జకాత్ చెల్లించుట శ్రేష్ఠము.

**02.** ఇతరులను యజమాని చేయలేని వాటి యందు జకాత్ సొమ్ము ఖర్చు చేయుట తగదు. ఉదా: బావి త్రవ్వించుట, రోడ్డు వేయించుట మొదలగునవి తగదు.

**03.** నిసాబ్ పరిమాణమునకు తగినంత సంపద ఒక్కరికే ఇచ్చుట మక్రూ అవుతుంది. జకాత్ హక్కుదారుని చెంత జకాత్ నిసాబ్ పరిమాణమునకు సరిపడ డబ్బులు సమకూరినచో, అటువంటి వారికి జకాత్ ఇచ్చుట తగదు.

**నోట్:** పై సిధ్ధాంతాలన్నియు బంగారు, వెండి, వ్యాపార సామగ్రి, ఫలసాయమునకు సంబంధిచినవి. ఇంకను పశుసంపద మొదలగువానిపై కూడ జకాత్ చెల్లించ వలసి యున్నది. వాటి వివరాలు ఉలమాల (ధార్మిక పండితుల) ను అడిగి తెలుసుకొన గలరు.

## 13. నఫిల్ సద్ఖ (దానము)

ఎవరైనా అవసరముగల పేదవారు కనబడినచో వానికి కొద్దో గొప్పో దగ్గర యున్నది ఇవ్వవలెను. మన ప్రవక్త హ|జ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు ఇట్లు తెలిపిరి: ఎంత చిన్నదైనా సరే, చివరికి చిన్న ఖర్జూరపు ముక్కైనా సరే దానము చేసి నరకాగ్ని నుండి రక్షింప బడండి. (ముస్లిం ఖవాతీన్ కే లియే బీస్ సబఖ్, స. 20)

హ|జ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు ఇట్లు తెలిపిరి: "నిస్సందేహంగా దానము అల్లాహ్ యొక్క కోపాగ్నిని చల్లార్చును. నికృష్టమైన చావునుండి రక్షించును." "దానమును అధిగమించి (దాటి) ఆపద రాజాలదు. కాబట్టి ఆపద రాకముందే దానము చేయుట కొరకు త్వరపడండి. (ముస్లిం ఖవాతీన్ కే లియే బీస్ సబఖ్, స. 21)

ఒక హదీసులో ఇట్లున్నది: అల్లాహు తఆలా ఇట్లు సెలవిచ్చిరి: "ఓ మానవులారా! ఇతరులపై ఖర్చు చేయండి, నేను మీపై ఖర్చు చేసెదను." ఇంకొక హదీసులో హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు హజ్రత్ ఆయిష రజియల్లాహు తఆలా అన్హా గారి సోదరి హజ్రత్ అస్మా రజియల్లాహు తఆలా అన్హా గారితో ఇట్లు పలికిరి: లెక్కించి లెక్కించి కూడబెట్టకుము, ఉదారంగా ఖర్చు చేయుము, అట్లు చేయనిచో, అల్లాహు తఆలా కూడ లెక్కబెట్టి ఇస్తాడు. అనగా అధికముగా ప్రసాదించడు. మరియు ఖర్చు చేయకుండా దాచిపెట్టకు, అట్లు చేసిన అల్లాహు తఆలా ఇవ్వడం మానేస్తాడు. కొద్దో గొప్పో వీలైనంత వరకు ఖర్చు చేయుము. (ముస్లిం ఖవాతీన్ కే లియే బీస్ సబఖ్, స. 21)

కేవలము ధన, వస్తువులే కాక ఈ క్రింది విషయాలు కూడ సదఖాయే.

**01.** ప్రతి మంచిపని సదఖాయే. (దానమే) (బుఖారీ, ముస్లిమ్)

**02.** 'అల్లాహు అక్బర్', 'సుబ్హానల్లాహ్', 'అల్హందులిల్లాహ్', 'లా ఇలాహ ఇల్లల్లాహ్', మరియు 'అస్తగ్ఫిరుల్లాహ్' అని అనుట కూడా సదఖాయే. (ముస్లిమ్)

**03.** మంచిని గురించి ఆజ్ఞాపించడము, చెడుల నుండి వారించడము గూడ సదఖాయే. (బుఖారీ, ముస్లిమ్)

**04.** జనము నడిచే దారిలో నుండి ముళ్ళు, రాళ్ళ లాంటి బాధాకరమైన వస్తువుల్ని తొలగించడము గూడ సదఖాయ్. (ముస్లిమ్)

**05.** గ్రుడ్డివారికి దారి చూపించడము, చెవిటి, మూగవారికి విషయ బోధ పరచడము కూడ సదఖాయే. (ముస్లిమ్)

**06.** ఏదైనా ప్రాణికి నీరు త్రాపించడము కూడ సదఖాయే. (బుఖారీ, ముస్లిమ్)

**07.** కష్టాలలో, అవసరాలలో ఉన్నవారికి సహాయము చేయడము కూడ సదఖాయే. (ముస్లిమ్)

**08.** బలహీనులకు తమ భుజాల ఆధారమిచ్చి పైకి లేపడము కూడ సదఖాయే. (ముస్లిమ్)

**09.** తోటి ముస్లిమ్ సోదరుణ్ణి నగుమోముతో పలకరించడము కూడ సదఖాయే. (అహ్మద్, తిర్మిజీ)

**10**. ఒక మనిషి నాటిన వృక్ష ఫలాలను తోటి మానవులు గాని, జంతువులు గాని, పక్షులు గాని తింటే లేక ఆ ఫలాలు దొంగిలింప బడితే వృక్షము నాటిన వ్యక్తి కొరకు అది సదఖాగా భావించబడుతుంది. (బుఖారీ, ముస్లిమ్)

**11.** ఇద్దరు వ్యక్తుల మధ్య న్యాయంగా తీర్పు ఇవ్వడము కూడా సదఖాయే. (అహ్మద్)

**12.** నమాజ్ కై వేసే ప్రతి అడుగు సదఖా గానే పరిగణింప బడుతుంది. (బుఖారీ, ముస్లిమ్)

**13.** దారిలో పడి ఉన్న హానికరమైన వస్తువుల్ని తొలగించడం కూడ సదఖాయే. (బుఖారీ, ముస్లిమ్)

**14.** భార్యతో సంభోగించడము కూడా సదఖాయే. (ముస్లిమ్)

ఒకసారి మన ప్రవక్త ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ "భార్యతో సంభోగించడము కూడా సదఖాయే" అని అన్నారు. ఈ మాట విని ఆయన అనుచరులు (సహాబాలు) ఎంతగానో ఆశ్చర్యపడి, 'ప్రవక్తా! మనిషి తన సహజ కోర్కెను తీర్చుకున్నను అందులో అతనికి పుణ్యము లభిస్తుందా?' అని అడిగినారు. అందుకు మన ప్రవక్త ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు సమాధానమిస్తూ 'అతను అదే పని అధర్మ పద్ధతిలో చేస్తే, అది అతనికి పాపము కాదా? అలాంటప్పుడు, ధర్మ సమ్మతమైన రీతిలో, ఆపని చేస్తే పుణ్యము లభించుటలో ఆశ్చర్యమేమున్నది? అని" అన్నారు. (ముస్లిమ్)

గోప్యముగా (స్వచ్ఛంద) దానము చేసేవాడు ప్రళయదినాన అల్లాహు తఆలా యొక్క సింహాసనపు నీడలో ఉంటాడు. (బుఖారీ)

ఎవరికైనా జకాత్ గాని లేక స్వచ్ఛంద దానము గానీ ఇచ్చి ఆ తరువాత అతనిని బాధించడము, ఎత్తిపొడవడము చేస్తే, దాని వలన వారు చేసిన దానము వృధా అయిపోతుంది. (అల్‌ఖుర్‌ఆన్,2/264)

మూడు రకాల సదఖాల ద్వారా మనిషికి అతని మరణము తరువాత గూడ పుణ్యము లభిస్తూ ఉంటుంది. అవి:

**01.** సదఖయె జారియా: ఉదా: మసీదు నిర్మించుట, బావి త్రవ్వించుట, అనాధ శరణాలయాలు కట్టించుట, వృక్షాలు నాటుట మొదలగునవి.

**02.** ప్రజలకు విద్యా బోధన చేయుట, దివ్య ఖుర్‌ఆన్ నేర్పుట, సన్మార్గము

చూపే గ్రంథాలు వ్రాయుట మొదలగునవి.

**03.** తమ తల్లిదండ్రుల మన్నింపు కొరకు ప్రార్థించే సదాచార సంపన్నులయిన సంతానాన్ని వదలి వెళ్ళుట. (బుఖారీ)

"ప్రజలారా! అల్లాహ్ పవిత్రుడు. ఆయన పవిత్ర వస్తువులనే స్వీకరిస్తాడు" అని మన ప్రవక్త హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు తెలిపిరి. (ముస్లిమ్) కావున అక్రమార్జిత ధనము నుండి దానము చేసిన, అది అల్లాహు తఆలా అంగీకరించదు.

## 14. జకాత్ & సదఖ(దానము) చేయువారి కొరకు దుఆ

రసూలుల్లాహ్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ వారిచెంతకు ఏ తెగవారైనా దానపు సొత్తు తెచ్చిన వారి కొరకు రసూలుల్లాహ్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు ఇట్లు దుఆ చేయు చుండిరి:

**"అల్లాహుమ్మ సల్లి అలైహిమ్"** (బుఖారీ) (ఓ అల్లాహ్! వీరిపై నీ కారుణ్యాన్ని కురిపించు)

సదఖ(దానము) ఇచ్చువాడు ఒక్కడే ఐతే:

**"అల్లాహుమ్మ సల్లి అలైహ్"** (ఓ అల్లాహ్! అతనిపై నీ కారుణ్యాన్ని కురిపించు)

సదఖ ఇచ్చు వ్యక్తి ఎదుట యున్నచో:

**"అల్లాహుమ్మ సల్లి అలైక్"** (ఓ అల్లాహ్! అతనిపై నీ కారుణ్యాన్ని కురిపించు)

సదఖ ఇచ్చువారు అనేకులు ఎదుట యున్నచో:

**"అల్లాహుమ్మ సల్లి అలైకుమ్"** (ఓ అల్లాహ్! వీరిపై నీ కారుణ్యాన్ని కురిపించు)

మనంకూడ ఇలాగే దుఆ చేయాలి.

**********

అల్లాహ్ ఈ విధముగా పేర్కొన్నాడు: "మీ దగ్గరి బంధువులకు వారి హక్కులను చెల్లించండి. అలాగే ఆగత్య పరులకు మరియు బాటసారులకు వారి హక్కులను చెల్లించండి. అంతేగాక వృధాగా డబ్బును ఖర్చు చేయకండి. నిస్సందేహముగా వృధాగా ఖర్చు చేసేవారు షైతాన్ సోదరులు. ఇక షైతాన్ తన ప్రభువు పట్ల ఎంతగానో కృతఘ్నుడు." (అల్‌ఖుర్ఆన్, సూరయె బనీ ఇస్రాయీల్, 26,27)